# మహాత్ముని
# స్వతంత్ర భారత సమస్యల
# నూతన దృక్పథములు.

('ధర్మజ్యోతి' నుండి పునర్ముద్రితము.)

మొదటి ప్రకరణము : నాలుగు ముఖ్య సమస్యలు

(1) ప్రజాస్వామ్యము
(2) భాషారాష్ట్రములు
(3) మద్యపాన నిషేధము
(4) భూసంస్కరణాలు

రెండవ ప్రకరణము : రెండు సామాన్య సమస్యలు.

(1) కర్షక సమస్య
(2) కార్మిక సమస్య

మూడవ ప్రకరణము : ఇతర చిన్న సమస్యలు దుర్భ్రమలు.


గ్రంథకర్త :

**వెలిదండ శ్రీనివాసరావు.**

విశాఖపట్నము.



**15—8—1958**





[ వెల : 25 న॥ పై॥

# మహాత్ముని స్వతంత్ర భారత సమస్యల నూతన దృక్పథములు.

## మొదటి ప్రకరణము.

( చంద్ర, సూర్య సంభాషణలు )

### —: ముఖ్య సమస్యలు :—

చంద్రుడు: సూర్యుడుగారూ! నమస్కారము. మనకు స్వాతంత్ర్యము వచ్చినదన్నమాటయేగాని, సౌఖ్యము రాలేదండి.

సూర్యుడు: నీవు ఉపయోగించిన స్వాతంత్ర్యము, సౌఖ్యము అన్న రెండుపదములలోని సరియైన భావములను నీవు పూర్తిగా గ్రహించినట్లు కనుబడదు. నీయుద్దేశములో స్వాతంత్ర్యమనగా స్వేచ్ఛ యనియు, సౌఖ్యమనగా ప్రియమైన వాటిని అనుభవించుట యనియు కనబడుచున్నది. ఇది బానిసత్వములో సంపాదించుకొనియుండిన పాత దృక్పథము. మహాత్ముడు మనకు సంపాదించిపెట్టిన స్వతంత్ర భారతములో నూతన దృక్పథము కలదు. దానిని గ్రహించలేనివారు నీవలెనే నిరాశాపూరితులగుచున్నారు.

చం. అదియెట్లు?

సూ. మనము మానవులని పిలువబడుచున్నాము. మానవుడను పదము 'మన్' అను ధాతువునుండి పుట్టినది. అనగా ఆలోచించువాడని యర్థము. ఏమని ఆలోచించుట? మనమీ ప్రపంచములోని కెట్లు వచ్చినాము? ఇక్కడ మన పని యేమి?, మన జీవిత ప్రయాణముయొక్క పరమావధి యేమి? అను నీమూడు ప్రశ్నలను గూర్చి ఆలోచించువాడే మానవుడనబడును. అది అందరికిని

సాధ్యము కాకపోయినను, వాటిని దీర్ఘముగ ఆలోచించునట్టి జ్ఞానులు తెలిపినదానినైనను మనము గ్రహించుటకు ప్రయత్నించవలెను.

చం. అదియేది ?

సూ. మానవునికి జ్ఞానము రెండువిధముల కలుగుచున్నది. ఒకటి స్వప్రయత్నము వలన, రెండవది స్వభావముచేత. మన పూర్వులు స్వప్రయత్నమువలన, పరిశోధన మూలమున, అనగా ఒక మెట్టునుండి వేరొక మెట్టుకు క్రమక్రమముగ ఆరు అంచెలలో సంపాదించిన జ్ఞానము షడ్దర్శనములని పిలువబడుచున్నది. వారిల్లో కొందరికి స్వభావముచేతనే, అనగా తమ మనస్సునకు భగవంతుని కృపచే గోచరించిన జ్ఞానము వేదములని పిలువబడుచున్నది. ఆ వేద ముల అంత్యభాగములే ఉపనిషత్తులు. షడ్దర్శనముల యొక్కయు, ఉపనిషత్తులయొక్కయు నిగ్గే భగవద్గీత. ఈ మూటిలో తెలుపబడిన జ్ఞానమును బట్టి మనము మన మూడు ప్రశ్నలకు సమాధానమును పొందవలెను.

చం. ఆ సమాధానమేమి ?

సూ. భగవద్గీతలో చెలిపినటుల పరమాత్మయొక్క అంశతో ప్రకృతి సంబంధమైన జ్ఞానేంద్రియములచేత అనాదిగా ఆకర్షింపబడి, జీవాత్మయై కర్మేంద్రియ సంబంధమైన శరీరమును పొందినది పర మాత్మకును ప్రకృతికిని గల సంబంధము, నీటికిని దానిలో నుండియే ఏర్పడిన మంచుగడ్డ భాగమునకునుగల సంబంధమే. ఇంక తైత్తిరీయో పనిషత్తులో తెలిపినట్లు, మానవుడు సమస్త భూతములతో పాటు పరమాత్మనుండి పుట్టి, ఆయనయందే ప్రకృతి సంబధమైన ప్రాపం చక వృత్తులలో మానవ సంఘమున జీవించుచు, ఆయనను పొంద వలెనను లక్ష్యముతో ప్రయత్నించుచు, తుదకాయనలో లీనమగు టయే మానవ జీవితపరమావధి. మరియు కఠోపనిషత్తులో చెలిపి నట్లు, మానవుడు ప్రకృతి సంబంధమైన "ప్రేయము" వలన గాక ఆత్మసంబంధమైన "శ్రేయము" వలననే తన జీవిత లక్ష్యమును

సాధించగలడు. ఇంతే గాక షడ్దర్శనములలోని సాంఖ్య, వేదాంత శాస్త్రములలో దెలుపబడినట్లు, మానవుడు పంచవింశతి తత్వముల కూటమియే.

చం. ఏమిటా పంచవింశతి తత్వములు?

సూ. పరమాత్మ, దానియంశమైన జీవాత్మ, మనస్సు, బుద్ధి, 'నేను' అను సంకుచిత 'అహం' భావము, అను పంచతత్వములు; పృథివ్యాది పంచభూత సమన్వితమైన శరీరము; ఆపంచ భూతముల యొక్క శబ్దాది పంచతన్మాత్రలు లేక వాసనలు; వాటిచే ఊహా మాత్రమున ఆకర్షింపబడిన పంచజ్ఞానేంద్రియములు; వాటిని శారీరికముగ అనుభవించుటకు ప్రోత్సహింపబడిన పంచకర్మేంద్రియములు మొత్తము ఇరువదియైదు తత్వములు. ఇవి మానవ గడియారము లోని చక్రములు. వీటి ప్రత్యేక వృత్తులను సరిగా గ్రహించి నప్పుడే మానవ జీవితరహస్యము బాగుగా బోధపడగలదు

చం. మీరు మొదట పేర్కొనిన 'స్వాతంత్ర్యము', సౌఖ్యము అను పదములకును, ఇప్పుడు చెప్పిన తత్వవిషయములకును గల సంబంధమేమి?

సూ. సంబంధమున్నందుననే ఇంత చెప్పవలసి వచ్చినది. స్వాతంత్ర్యములోని 'స్వ' సర్వమానవులయందు పూసలలోనిదారము వలె శాశ్వతముగానున్న ఆత్మసంబంధమైనది. ఇంక 'స్వేచ్ఛ' లోని 'స్వ' ప్రకృతితో ఐక్యము చేసుకొనుటవలన తాత్కాలికముగ ఏర్పడిన సంకుచిత ప్రత్యేకతకు సంబంధించినది. ఇది తాత్కాలిక ప్రత్యేకతను స్థిరపరచి ఉదార జీవితలక్ష్యమును పొందనీయదు. ఈ భేదములనుగురించి మహాత్ముడు 1917 సం॥లోనే గుజరాతు రాజకీయ మహాసభయందు స్పష్టముగా విశదీకరించి, పాశ్చాత్యుల ఆదర్శము స్వేచ్ఛయనియు, భారతీయుల ఆదర్శము స్వాతంత్ర్యమనియు బోధించియుండెను. అదేవిధముగా ప్రకృతిసంబంధమైన, తాత్కాలికమైన కేవల వ్యష్టికి మాత్రము సంబంధించినది 'ప్రేయము.' దీనిని

నిర్ణయించునది అవ్యష్టియే. అందరియందును వ్యాపించియున్న, ఆత్మ సంబంధమైన శాశ్వతమైన సంఘములోని సమిష్టికంతకును సంబంధించినది 'శ్రేయము' దీనిని నిర్ణయించువారు సమిష్టి దృష్టిగల అధికులు. రోగి తనప్రేయమును నిర్ణయించుకొనును. వైద్యుడు రోగి శ్రేయమును నిర్ణయించి అతనికి ఒక్కొక్కప్పుడు అసౌఖ్యమనబడుదానిని కలిగించవలసి వచ్చును. మరియు సౌఖ్యము లేదనుకొనుటకు వేరొక కారణము కూడ కలదు. చిలుక తాను పంజరములో నున్నప్పటికన్న స్వాతంత్ర్యమును పొందినవెనుక తిండికై ఎక్కువ కష్టపడవలసివచ్చును. స్వాతంత్ర్యస్థితిలో స్వయంకృషి ఎక్కువ అవసరము. స్వయంకృషికింకను మనము అలవాటు పడనందున, పంజరము లేనందున అసౌఖ్యము కనబడవచ్చును. స్వయంకృషివలననే మానవుడు స్వాభావికాభివృద్ధి పొందగలడు.

చం. మీరు తెలిపిన నూతనదృక్పథము ప్రజలలో వ్యాపించలేదు. మరియు ఆ దృక్పథమునకు విరుద్ధముగ కొందరు పనిచేయుచున్నారు.

సూ. వారెందుకిట్లు పనిచేయుచున్నారో తెలుసునా?

చం. నాకు తెలియదు.

సూ. నేను చెప్పెదను వినుము. స్వాతంత్ర్యపదమనుపదము పరిపాలనకు సంబంధించినది. మనదేశములో పురాతన చారిత్రిక కాలమునుండియు పరిపాలన ఒకానొక వ్యక్తి చేతిలోనేయుండెడిది. అతనిని మనము 'రాజు' అని పిలుచుచుంటిమి. అట్టిరాజులా కాలములో మన దేశములో పెక్కుమంది యుండిరి. ఒక రాజును వేరొక రాజు యుద్ధములో జయించి అతని పరిపాలనను హస్తగత మొనరించుకొనుచుండెను. మానవ పరిణామములో, పరిపాలన చేయగల ఆత్మశక్తి ఒక ప్రత్యేక వ్యక్తిలోనే గాక అందరిలోను వికసించి వ్యాపించవలసిన ఆవశ్యకత యేర్పడుటచే అట్టి అవకాశము మహాత్మునిద్వారా మొదటిసారి ఈ దేశమున

కిప్పుడే లభించినది. అది ప్రస్తుతమున ఆయనచే నూతనరూపమున సృష్టింపబడిన 'కాంగ్రెసు' సంస్థ అధ్వర్యమున జరుగుచున్నది. ఒక రాజు వేరొక రాజునుండి పరిపాలనా యంత్రముకు స్వాధీనము చేసి కొనదలచిన పాత శ్రేయభావమే కాంగ్రెసేతర సంస్థల ప్రయత్నము లకు కారణమగుచున్నది. ప్రజాస్వామ్యములో యుద్ధమునకు తావు లేనందున, కాంగ్రెసు దృక్పథమునకు భిన్నమైన ప్రచారమును ఆ యితరసంస్థలు ప్రజలలో చేయువలసివచ్చుచున్నది. ఆకారణముననే మహాత్ముని కాంగ్రెసు దృక్పథము ప్రజలలో గట్టిగా నాటుకొనలేక పోవుచున్నది. వివిధ దృక్పథములు గల వివిధ వ్యక్తులయొక్క వివిధ శ్రేయములకు సహజముగా పరస్పర సంఘర్షణముండును. సర్వ పౌరులకు సమానమైన శ్రేయోదృష్టివలననే సంఘములో నిజమైన సౌఖ్యమేర్పడగలదు. అట్టి శ్రేయోదృష్టి పరార్థపరులగు కొద్దిమంది సజ్జనులకే సాధ్యము. అట్టి కొద్దిమంది నాయకులను అనుసరించుటయే ప్రస్తుతమున సామాన్యులగు పెక్కు అనుచరుల కర్తవ్యము.

చం. మీరు చెప్పినది బాగున్నది. ఇతర సంస్థలకు చెందిన నాయకులు వేరొకవిధముగా పౌరశ్రేయస్సును ఊహించి ఆపంథాలో వారి అనుచరులను నడుపజూచుటలో తప్పేమున్నది.

సూ: బాగుగా ఆలోచించినచో ఆయితరసంస్థల దృక్పథములు ప్రజాస్వామ్యము ననుభవించుచున్న పాశ్చాత్యదేశములలోని బహువిధ భౌతికదృష్టిగల పాతపంథాలే. అవి ఏకైక ఆధ్యాత్మికదృష్టికి ప్రాధాన్యమిచ్చు ఈ దేశమునకు పనికిరావు.

చం. అయితే, మహాత్ముడు తన ప్రత్యేక ఆదర్శ నిర్వాహణోద్దేశముతో మాత్రమే తాను పెక్కుశ్రమలకోర్చి మనకు సంపాదించి పెట్టిన స్వాతంత్ర్యభారతముయొక్క ప్రస్తుత సమస్యలేవి? వాటిని పరిష్కరించుట కవసరమైన ఆయన నూతన దృక్పథములేవి?

సూ. ఆసమస్యలు ముఖ్యముగా నాలుగు. అవి (1) ప్రజాస్వామ్యము, (2) భాషారాష్ట్రములు, (3) మద్యపాన నిషేధము,

(4) భూసంస్కారణలు. వీటి పరిష్కారమునకు పాశ్చాత్యదృక్పథములు పనికిరావు.

చం. ఆ సమస్యలకు వాటికి కావలసిన నూతన దృక్పథములను సవిస్తరముగ సెలవీయగలరా?

సూ. ఈవరకు చెప్పినట్లు, ప్రజాస్వామ్యము, అనగా ప్రజాప్రభుత్వము, మానవ పరిణామమునకు అత్యావసరము. అట్టి పరిణామము సర్వపౌరులలోను ఏకకాలమున ఒకేవిధముగా నుండజాలదు, కావున ఉన్నతమైన సమిష్టి శ్రేయముయొక్క విలువను గ్రహించిన కొందరు జ్ఞానులు, హీనమైన కేవల వ్యష్టిప్రేయముయొక్క విలువతో తృప్తినొందు పెక్కుమంది అజ్ఞానులను క్రమక్రమముగా ముందుకు తీసికొని వెళ్ళవలసియున్నది. అటులగాక పెక్కుమందియొక్క ఇష్టము (ప్రేయమును) కొద్దిమంది నాయకులు పాటించువలయుననుపాశ్చాత్య సిద్ధాంతమును మనదేశమునకు పనికిరాదు. అందువలననే మహాత్ముడు 1930 సంవత్సరములోనే, అనగా సంపూర్ణ స్వరాజ్య తీర్మానమైన వెంటనే, తరువాత ఎప్పుడో మనకు రాబోయే ప్రజా స్వామ్యమును గూర్చి ముందుగనే, ఈ విధముగా తెలిపియుండెను :—

"ప్రజాస్వాతంత్ర్య లక్షణమగు ప్రజాస్వామ్యమునకు 'డెమొక్రసీ' అని పేరు. కేవలము మెజారిటీ వోటుమీదనే ఆధారపడిన పాశ్చాత్య ప్రజాస్వామికము ఇదివరకే వ్యర్థమయ్యెను. ఆ పద్ధతి ఇపుడు పంచాగ్నిహోత్రముల మధ్య నున్నది. పాశ్చాత్యదేశములకు, ఆ పద్ధతివలన అవినీతి, మోసము మిక్కుటమయ్యెను. భారతభూమిలో యదార్థ ప్రజాస్వామ్య శాస్త్రము వెలుగొందవలయునన్నచో, ప్రజాప్రభుత్వములో సహజముగా అధికారమును పొందు ఏ కొద్దిమందియో ప్రజలయొక్క ప్రతినిధులగుటచే, వారు తమ ప్రభుత్వమును, ఆ ప్రజలయొక్క ఆదర్శములను శ్రేయములను, ప్రతిబింబించునట్లుగా చేయవలెను. అట్టిది ఆ యధికారుల త్యాగశీలత మీదను, సేవానురక్తిమీదను ఆధారపడియుండును."

చం. బ్రిటిషు ప్రభుత్వములోగూడ ప్రజా ప్రతినిధులుండెడి వారు కదా, ఇప్పటి ప్రతినిధులకును, అప్పటి ప్రతినిధులకును గల భేదమేమి?

సూ. అప్పటి ప్రతినిధులు అప్పటి ప్రభుత్వమునకు సలహాల నిచ్చువారుమాత్రమే. ఆ సలహాలను ఆ ప్రభుత్వము తప్పక పాటించవలసిన గట్టినియమములేదు. అందువలన ఆ ప్రభుత్వము ప్రజాస్వామిక మనబడజాలదు. ఆ కారణముననే, అప్పుడు సత్యాగ్రహములు, శాసనధిక్కారములు, సమ్మెలు, నిరాహారదీక్షలు అవసరమయ్యెను. ప్రజాస్వామ్యములో అట్టివాటికి చోటులేదు. ఇప్పుడును వాటిని కొందరు అనుసరిస్తున్నారంటే దానికి బాధ్యులు మనదేశమున కింకను పూర్తి స్వాతంత్ర్యము రాలేదన్న భ్రమలో ప్రజలను ఉంచదలచిన కాంగ్రెసేతర సంస్థలే. మన రాజ్యాంగ చట్టమునను సరించి సమిష్టి శ్రేయోదాయక దృష్టిగల ప్రజాప్రతినిధుల సలహాలను, ప్రభుత్వ మంత్రులు తప్పక పాటించవలసియుండుటచే, ప్రజల శ్రేయస్సును తద్వారానే సాధించుటకు చక్కని రాజమార్గమున్నప్పుడు, అదిలేని పరప్రభుత్వ కాలములో, మనము గత్యంతరములేక, విధిలేక అనుసరించవలసిన వచ్చిన, సందులు గొందులు మనకిప్పుడెందులకు?

చం. బాగున్నది. ఇంక భాషా రాష్ట్రములను గురించి మహాత్ముడేమనెను?

సూ. ఈ విషయములను బాగుగా గ్రహించుటకు, మనదేశములోని నూతన రాజకీయపరిస్థితిని దృష్టియందుంచుకొనవలయును.

చం. అదియేది?

సూ. మనదేశము మొదటినుండియు వైజ్ఞానికముగ ఏకమై యుండినను, రాజకీయముగ, అంగ, వంగ, కళింగాది ఏబదియారు స్వతంత్రరాజ్యములుగ ఏర్పడియుండెను. అందువలన ఆకాలములో రాజకీయ దృక్పథము ప్రాంతీయ సంకుచితములుగ ఏర్పడియుండెను. బ్రిటిషు ప్రభుత్వములో ఏకరాజ్యమేర్పడినను, అది మనబానిస

ప్రవృత్తిలో, యాచక, యాచక శత్రుత్వస్థితిలో, సంభవించినందున ఆ ఏకరాజ్య దృక్పథభావము. స్వాభావికముగా మనలో నాటుకొనలేదు. దేశమంతయు రాజకీయముగ ఒకటయేయను సరికొత్త భావము, మొట్టమొదటిసారిగా, మహాత్ముని స్వరాజ్య సంపాదన ప్రయత్నములో భారతీయులెల్లరు ప్రాంతీయాభిమానములను విసర్జించి, ఏకముగా పాల్గొనుటవలననే, అంకురించినది. కాని, వెనుకటి అనేకవేల సంవత్సరములుగ నుండియుండిన ప్రాంతీయభేదభావము పూర్తిగా వదలిపోనందున, మనలో చాలమంది ప్రముఖులుసహితము తిరిగి ఇప్పుడు పాతప్రాంతీయాభిమాన మనస్తత్వములకు అప్రయత్నముగ లోనుగావలసి వచ్చుచున్నది. ప్రస్తుతమున మనదేశమున కంతకును మొట్టమొదటిసారి ఒకే రిపబ్లికు ప్రభుత్వము ఏర్పడినదన్న నూతన సత్యమును చాలమంది గ్రహించలేదు. అందువలననే మహాత్ముడు తాను చనిపోవుటకు ఐదుదినములు ముందుగా, అనగా 1948 జనవరి 25వ తేదీన, అప్పటి సందర్భమును పురస్కరించుకొని, "ముందుగా మనభారతైక్యతను మనస్సునందుంచుకొనవలయును." అని నొక్కి వక్కాణించుచు, భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతమును గూర్చి, యీవిధముగా దెలిపియుండెను :—

"కాంగ్రెసు ఈవరకే భాషాప్రయుక్త సిద్ధాంతమును అవలంభించినది. అటుల భాషాప్రయుక్త విభజనవలననే, ఈ దేశములో ప్రతి పౌరునికిని విజ్ఞానాభివృద్ధికలుగ గలదు. అయినను అటువంటి విభజన భారతదేశమునకు నైజమైన ఐక్యతకు భంగకరమైన శక్తులను రేకెత్తించకుండునట్లు జరుపబడవలయును. అట్టి విభజన వలన, ఒకవేళ, సంకుచిత రాష్ట్రీయ తత్వమేర్పడి, పరస్పర వైషమ్యములు, పోటీలు ఏర్పడేస్థితులు సంభవించే యెడల, అట్టి స్థితి మన ఐక్యభారతమునకు ఉపద్రవకారి కాగలదు. కావున ముందుగా మనభారతైక్యతను మనస్సున నుంచుకొని అట్టినూతన దృక్పథముతో, నూతన భాషా రాష్ట్రముల సరిహద్దులను తిరిగి క్రొత్తగా నిర్మించుటకు బౌండరీ కమీషను అవసరముకాదు. ఎందువల్లననగా, అట్టి

బౌండరీ కమిషను విజాతీయపద్ధతి. విజాతీయపద్ధతులను మనమివ్వాడు వదలించుకొన్నాము. దేశస్వాతంత్ర్యానంతరము నూతనముగా ఏర్పడిన ఈ నూతన ఐక్యభారతి దృక్పథముతో భారతీయులెల్లరు, పరస్పరము సమాధానపడి, విరోధగ్రస్తులు తమకు తామే తమ తమ ప్రత్యేక భాషా పరిహార్గాలను నిర్ణయించుకొనుట, ఆ నిర్ణయమును భారతి ప్రధానమంత్రి ఎదుట బెట్టి, దానిపై ప్రభుత్వాధికార ముద్రను వేయవలయునని కోరుట మాత్రమే ఉత్తమోత్తమమైన కార్యము."

చం: మహాత్ముడింత స్పష్టముగా జెప్పినను, మనలోని కొందరు నాయకులు సైతము ఆయన వెలిబుచ్చిన నూతన దృక్పథమును సరిగా గ్రహించలేకుండుట మిగుల శోచనీయము.

సూ: ఈ వరకు చెప్పినట్లు, మహాత్ముడూహించిన స్వతంత్ర భారత ప్రభుత్వము భారతీయ పౌరులందరికిని సమానముగా సంబంధించిన ఏకైక రిపబ్లికు ప్రభుత్వము. అది కేవలము పరిపాలనా సౌకర్యదృష్ట్యా మాత్రమే రాష్ట్రములకు వికేంద్రీకరింపబడినది. మహాత్ముని ఉద్దేశమునకు విరుద్ధముగ ఇప్పుడు భాషాతత్వము గూడ కుల, మత, తత్వములవలె వికృతరూపమును ధరించనారంభించినచో, వేరు మార్గమవలంబించవలసి యుండును. దేశమునకంతకును ఏక పరిపాలనా భాషయొక్క అవసరము ఇప్పుడు గుర్తించబడుచున్నది.

చం: ఇంక మద్యపాన నిషేదమును గూర్చి మహాత్ముడేమని తెలిపెను.

సూ: త్రాగుడును గుర్చి మహాత్ముడు 1929 సంవత్సరము ఆగష్టు 8వ తేదీన, అనగా సంపూర్ణ స్వరాజ్య తీర్మానమునకు పూర్వమే, ఈ విధముగా తెలిపియుండెను :—

" త్రాగుడు దొంగతనముకన్నను, వ్యభిచారముకన్నను, ఎక్కువ హీనమైనది. అందు తరుచు ఆ రెంటికిని కారణముకూడ

అనుచుండుట లేదా? దొంగ ఇతర మనుజుని ప్రాపంచిక వస్తువు అనే అపహరించును. కాని త్రాగుబోతు తన ఆత్మగౌరవమును తానే అపహరించును. త్రాగుబోతులను భర్తలనుగా గలిగిన స్త్రీలకే, తమగృహములలో త్రాగుబోతుతనమువలన కలుగుచున్న దుర్భరఘోరములు బాగుగా తెలియగలవు. నన్ను భారతదేశ మునకంతకును ఒక గంటసేపు నియంతగా నియమించిన యెడల. నేను మొట్టమొదట చేయునదంతయు, దేశమునందలి సారా దుకాణముల నన్నింటిని, ముదరా ఏమియు ఇయ్యకుండ, వెంటనే మూయించి వేయుటయే.”

చం: త్రాగుడును గూర్చి, మన నవభారత జాతి పితయైన మహాత్ముని అభిప్రాయ మెంత తీవ్రముగనున్నది! మానవ జీవిత లక్ష్యమును సాధించుటకు అది గొప్ప అంతరాయముగ నుండుటయే, ఆ తీవ్రతకు కారణము గావచ్చును. కాని, త్రాగుడును శాసనములవలన పూర్తిగా నిర్మూలించుట సాధ్యమా! ఇతర దేశములలో దీసికొనబడిన శాసన ప్రయత్నములు సఫలములైనవా?

సూ: దొంగతనము, మోసము మొదలగు నీచ వ్యసన వ్యాపకములు శాసనములవలన పూర్తిగా అరికట్టబడినవా? అట్టితరి, శాసనములేల చేయవలయును? ఆ వాదమే త్రాగుడుకు కూడ వర్తించును. దుర్గుణములను సాధ్యమైనంత వరకు తగ్గించ ప్రయత్నించుటయే శాసనముల లక్ష్యము. ఇంక ఇతర దేశములలో త్రాగువారు, మన దేశములోవలె, సిగ్గుపడరు. ఈ విషయమును మహాత్ముడు 1929వ సంవత్సరము మార్చి నెలలో రంగూనులో నుండగా, అప్పుడచ్చట జరిగిన బర్మాస్త్రీల క్రైస్తవ టెంపరెన్సు యూనియనువారి సభలో తెలియబరచి, హిందూ దేశములోని ప్రజలందరికి, త్రాగుడు మంచిదికాదని ఇదివరకే తెలిసియున్నందున అందును గూర్చి, పాశ్చాత్య దేశములలోవలె, ప్రభుత్వము శాసనము చేయుటకు ముందుగా ప్రజలలో దానిని గూర్చిన విద్యా

వ్యాప్తిని కలిగించవలసిన ఆవశ్యకత లేదని తెలియుపరచెను. మన ప్రభుత్వము మద్యపాన నిషేధశాసనములను జేయ ప్రయత్నించుటలో రెండు ఉద్దేశములు గలవు :— (1) చెడు పనిని ఉద్దేశపూర్వకముగా ప్రోత్సహించి, తద్వారా ప్రభుత్వ ఆదాయమును వృద్ధిపరచుకొను ప్రయత్నమును వదలుకొనుట. అనగా ఆ చెడు కర్మలో భాగస్వాములు కాకుండుట. (2) ప్రజలలో ఆ దుర్గుణమును నిరుత్సాహపరుప్రయత్నించుట, దీనికి ప్రజాసహకారమవసరము, అట్టి సహకారమీయనిచో, ఆ తప్పు ప్రజలదే. ప్రజాప్రభుత్వములో ప్రజలందరు కూడ తాము ప్రభుత్వములో భాగమున్న సత్యమును గుర్తుంచుకొని, తమ బాధ్యతలను నిర్వహింపవలెను. ఇది మనకు క్రొత్త అనుభవమగుటచే, మనలో చాలమంది దీనిని ఇంకను గ్రహించలేదు.

చం: ఇంక నాల్గవ విషయమగు భూసంస్కరణలను గూర్చి మహాత్ముజీ యెట్లు స్పష్టముగా దెలిపెనా ?

సూ: ఒక్క భూమి విషయమునసేగాదు. మానవుడు, తను స్వయంకృషిచేత నైనను, లేక అప్రయత్నముననైనను తనకు లభించిన వస్తువులన్నియు ఈశ్వరుని వలన సర్వమానవుల కొరకే ఉద్దేశింపబడినవనియు, కావున వాటిలో తనకు అవసరమైన వాటినే తనవిగా భావించి, ఉపయోగించుకొనవలయుననియు, మిగిలినవి ఇతరులవి గావున, తాను వాటిని అనవసరముగ ఉపయోగించుకొనుటకు అభిలషించగూడదనియు తెలిపిన ఈశావాస్యోపనిషత్తులోని మొదటి శ్లోకము మహాత్మునిలో చాలా మార్పును దెచ్చినది. ఆ శ్లోకమే కవి రవీంద్రుని తండ్రియైన మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్ గారిలోను గొప్పమార్పును దెచ్చియుండెను. మరియు అట్టి వస్తువులలో భూమి స్థిరత్వమును కలిగియున్నందున 'ఆస్తి' యని యనబడజాలదు. దానిని ఆస్తిగా పరిగణించుకొని, చాపచుట్టగా జుట్టి తన చంకను పెట్టుకొనదలచిన

హిరణ్యాక్షుని గతి ఏమైనదిగా నిరూపింపబడినది? ఆ కథవలన మనము నేర్చుకొనవలసిన నీతి ఏది? స్థిరత్వము లేక, ఎవరిచే నైనను, ఎక్కడికైనను, వెంట తీసికొనబడగలిగినదే ఆస్తి యన బడును. ఒకడు కష్టపడి స్వయంకృషిచే సంపాదించుకొనిన ధన, కనక, వస్తు, వాహనంబులను తన ఉపయోగార్థమై దాచుకొనుట వలన ఇతరుల కంతగా హాని లేదు. కాని, భూమివిషయమున అటులగాదు. అది అందరి ఉపయోగార్థమై సృష్టింపబడినది. కావున ఏ యొక్కడు తన ఉపయోగమునకు మించిన దానిని ఉంచుకొనవసరము లేదు. ఉంచుకొనవలసి వచ్చినచో, దానికి తాను ధర్మకర్తయని యనుకొనవలయును అందువలననే మహాత్ముడు 'దున్నే వానిదే భూమి' అని నొక్కినక్కాణించి యుండినను 'దున్నేవాడు' అనగా కేవలము నాగలి పట్టుకొని కాయకష్టము చేయువాడే గాక, సేద్యమునకు అవసరమైన మదుపుపెట్టి భూస్వామి కూడ, 'దున్నేవాడే' అని 1938 లోనే స్పష్టముగా దెలిపియుండెను. భూస్వామియు తాను సేద్యము చేయని భూమిని ఊరకనే ఉంచుకొనరాదు. భూమిని ఉపయోగమునకు దేవలయును. ఆపని చేయుటకు తనకు వీలులేనిచో, ఇతరులకు అవకాశమీయవలయును. ఆ యుద్దేశ్యముతోడనే, మహాత్ముని అనుచరుడైన ఆచార్యవినోబాభావే గారి భూదానోద్యమ మేర్పడినది. భూదానోద్యమము భూస్వాములలో హృదయపరివర్తనమును కలిగించుటకు ఉద్దేశింపబడినది. స్వాభావిక మైన హృదయ పరివర్తన మార్గమున గాక, కేవలము బలవంతము వలన భూస్వాములనుండి భూములను లాగికొని వాటిని బీదలకు ఇతరులకు పంచిపెట్టుటవలన, ఆ ఇతరుల అసంతృప్తిని తొలగించడము జరుగవచ్చును. కాని, ఆ బలవంతమువలన భూస్వాములలో క్రొత్తగా అసంతృప్తిని కలిగించడ మేర్పడును. అనగా ఒక ఇంటిముందు ఉన్న చెత్తను వేరొక ఇంటిముందుకు జరుపుట వంటిదే యగును. ప్రకృతి స్వభావమును గమనించినచో, క్రొత్తగా తన ప్రయత్నము లేక లభించినదాని వలన కలుగు సంతోషముకన్న ఉన్నదానిని

ఇతరుల బలవంతముచే, పోగొట్టుకొనుటవలన కలుగు విచారము ఎక్కువగా నుండును. కావున తగిన పరిస్థితులను కల్పించి, హృదయ పరివర్తనమును పొందించినప్పుడే మానవునిలో, నిజమైన, నైజమైన, శాశ్వతమైన మార్పు కలుగగలదు. ప్రపంచమున, ఈవరకెవరును, ఎన్నడును, కని, విని, ఎరుగని ఈ నూతన రహస్యమార్గమును ఉపయోగించియే, మహాత్ముడు, పర ప్రభుత్వములో హృదయ పరివర్తనమును కలిగించి, వారే తమ బ్రిటిషుపార్లమెంటులోనే, 1947 జూలై 18వ తేదీన "ఇండియను ఇండిపెండెన్సు" చట్టమును చేసి, స్నేహపూర్వకముగా మనకు ఈ దేశమును ఇచ్చి వెడలిపోవునట్లు చేయగలిగెను. మహాత్ముడు కనిపెట్టి మనకు ప్రసాదించిన ఈ నూతన మార్గమును మనము ఉపయోగించుకొనుటకు ప్రయత్నించ వలసియున్నది. లేకున్నచో ఆయన పరిశోధన వృథాయగును.

చం: ప్రతివిషయములోను హృదయ పరివర్తనమను నూతన మార్గమును ఉపయోగించుట సాధ్యమా?

సూ: హృదయ పరివర్తనమనగా హృదయము లేక మనస్సు మారుట. ఏ విధముగా మారుట? మనము కోరువిధముగా. ఈవరకు చెప్పినట్లు మానవుల కోరికలు రెండువిధములుగా నుండును. ఒకటి, తన వ్యష్టికి సంబంధించినది; రెండవది, మానవ సమిష్టికి సంబంధించినది. వ్యష్టి అనగా పరమాత్మ అంశమైన జీవాత్మ ప్రకృతిలో లీనమై, ఒక ప్రత్యేకతను వహించి, సంకుచిత దృక్పథమును పెంపొందించుకున్నటువంటిది. కాని, సర్వమానవ సమిష్టి దృష్టిలో ప్రత్యేకత లేకపోవుటవలన, అందరియందును పూసలలోని దారమువలె నున్న పరమాత్మ దృక్పథముండును. ఆ దారమును ఎవరైనను చలింపజేయగలిగినచో ఎదుటివానిలో స్వాభావికమైన చలన మేర్పడును. అనగా, ఇద్దరి జ్ఞానము ఏకమగును. ఈ జ్ఞానము ఒకే మామిడిపండులోని పెక్కుముక్కల ఏకైక రుచివంటిది. ఆ చలనమే హృదయ పరివర్తనము. ఈ సత్యమును ముందుగా

మనమందరము గ్రహించవలయును. దానిని సాధించుటకు ముందుగా మనలో మార్పు ఏర్పడవలయును. ఇది స్వార్థమును తగ్గించు కొనుటవలనను, పరార్థమును హెచ్చించు కొనుటవలనను, క్రిమ క్రిమముగా ఏర్పడును. దీనికి దైవచింతన ముఖ్యము. అనగా, ఒక బల్బులోని ఎలక్ట్రిక్ దీపము వెలుగుటకు మెయిను కరెంటుతో 'స్విచ్' ఆన్ చేయవలసినట్లే, సత్యజ్ఞాన ప్రాప్తికి, దైవముయొక్క సర్వవ్యాపకత్వమును చింతన చేయుచుండవలయును. సత్యమైన ఈ నూతన దృక్పథముతో మనము ఇతరులను సమీపించినచో, మన ప్రియత్నము చాలవరకు నెరవేరగలదు. అనగా ఇతరుల యందు నివురు గప్పిన నిప్పువలె నున్న జ్ఞానజ్యోతిని ప్రజ్వరిల్లజేయ గలము. అనగా వారిలో ప్రతిధ్వనిని కలిగించగలము. అదియే హృదయ పరివర్తనము.

చం: అయితే బలవంతమెప్పుడును పనికిరాదనియా, మీ ఉద్దేశము ?

సూ: మంచి పనిని చేయించుటకు హృదయ పరివర్తనమవసరము, చెడ్డ పనిని నిరోధించుటకు బలవంతము అవసరము కావచ్చును.

చం: సూర్యుడుగారూ, మీవలన చాలా సంగతులను వింటిని. మీకు కృతజ్ఞుడను. మీరు చెప్పినవాటిని బాగుగా జీర్ణము చేసికొనిన వెనుక అనుమానములున్న యెడల, తిరిగి తమ దర్శనము చేసికొని, వాటిని నివర్తి చేసికొనుటకు బ్రయత్నించెదను.

సూ: భగవంతుని ఇచ్ఛయే నెరవేరును గాక. ఓం శాంతిః, శాంతిః, శాంతిః.



రెండవ ప్రకరణము.

( చంద్ర, సూర్య సంభాషణలు )

## :కర్షక, కార్మిక సమస్యలు :—

చంద్రుడు : సూర్యుడుగారూ, నమస్కారము. తిరిగి తమ దర్శనము చేయు భాగ్యము లభించినది. ఈ వరకు తమరు ప్రజా స్వామ్యము, భాషా రాష్ట్రములు, మద్యపాన నిషేధము, భూసంస్కరణలు అను నాలుగు సమస్యలను గురించియే బోధించియుండిరి. ఇంక వేరు సమస్యలు లేవా ?

సూర్యుడు : లేకేమి ? ఆనాలుగు ముఖ్యసమస్యలని చెప్పి యుంటిని. ఇంకను చాలా సమస్యలు గలవు.

చం: వాటిని గూర్చి కూడా సెలవిచ్చెదరా ?

సూ: ప్రస్తుతమున రెంటినిగూర్చి మాత్రమే చెప్పెదను. అవి (1) కర్షక సమస్య, (2) కార్మిక సమస్య.

చం : ఈ రెంటికిని, ఈవరకు చెప్పిన నాల్గింటికిని సంబంధ మున్నదా ?

సూ : తప్పక ఉన్నది. ముఖ్యముగా ఈ రెండును మొట్ట మొదటి ప్రజాస్వామ్యమునకు సంబంధించినవే. ప్రజాస్వామ్య మనగా, ప్రజలయొక్క స్వామితనము, అనగా ప్రజాప్రభుత్వము. ప్రజా స్వామ్యములో ప్రజాసామ్య ముండును. అనగా ప్రజల సమా నత్వ ముండును. ఇది, ఆ రెంటియొక్క ఆదర్శము. దీనికి మొదటి మెట్టు, ప్రతి పౌరుడును, కుల, మత, విపక్షతలులేక, సంఘములోని అందరియొక్క శ్రేయస్సును సమానముగా మనస్సు నందుంచు కొనుటకు ప్రయత్నము చేయవలెను. దీనికే సోషలిజము అన వచ్చును. ఈ సోషలిజము క్రమక్రమముగా వృద్ధిపొందవలసి

యున్నది. ఎందువల్లననగా, పైకికనబడు అన్నమయ కోశమైన శరీరములలో భేదములు కనపడుచున్నను, మనోమయ కోశమైన మనస్సులలో భేదములుండును. ఆ భేదములు తగ్గినకొలది, సమానత్వము క్రమక్రమముగా ఏర్పడగలదు.

చం : ఆ భేదములు ఎట్లు తగ్గగలవు ?

సూ : క్రిందటిసారి చెప్పినట్లు, సర్వమానవులును ఏకైక పరమాత్మనుండియే యుద్భవించిరన్న సత్యమును బాగుగా మనస్సునందుంచుకొనినచో, ఆ భేదములు మనోదృక్పథమునుండి జారిపోవును.

చం : బాగున్నది. మీరిప్పుడు క్రొత్తగా సెలవియ్య దలచిన, కర్షక, కార్మిక సమస్యలనుగూర్చి విపులముగా సెలవియ్య గోరుచున్నాను.

సూ : మానవుడు వ్యష్టిగానే, అనగా ఒక్కడుగానే, ఈ ప్రపంచములో, జన్మించినను, మరణించినను, జీవించుకాలములో సమిష్టి, అనగా సంఘము, పైననే, ఆధారపడవలసియుండును. ఆ సంఘము మొదట్లో తల్లితండ్రులుగా ఏర్పడి, క్రమక్రమముగా పెద్దదగును. సంఘము మనునది అందలి అందరికిని సంబంధించిన 'ధర్మము' అను ఒకవిధమైన కట్టుబాటుకు లోబడి, దానిపై ఆధారపడియుండును. సాంఘిక ధర్మముతో బాటు, వ్యక్తి ధర్మముకూడ కలదు. వ్యక్తిధర్మమనగా తన ఆత్మకు సంబంధించిన ఆధ్యాత్మికాభివృద్ధి ప్రయత్నము మాత్రమే. అట్టి ధర్మసాధన కొరకే మానవుడు తనశరీరమును ఉపయోగించుకొనవలయును. అందుకుగాను శరీరమును తగిన స్థితిలోనుంచుట అవసరము. ఆ కారణముననే మానవునికి ఆహారము యొక్కయు, ఇతర సదుపాయకర వస్తువులయొక్కయు, ఆవశ్యకత ఏర్పడినది. ఆహారమును ఉత్పత్తి చేయుటకు కర్షకులును, ఇతర వస్తువులను ఉత్పత్తి చేయుటకు కార్మికులును అవసరము.

చం : కర్షకులును, కార్మికులును లేకున్నయెడల, ప్రపంచములో, మానవసంఘ జీవితమే జరుగదన్నమాట.

సూ : అవును. మనమిప్పుడు విచారించునది, మన భారతీయ సంఘమును గురించియే.

చం : భారతీయ సంఘమనునది ఎట్లు ఏర్పడినది?

సూ : అసలు సంఘమనునది రెండువిధములుగా ఏర్పడును. ఒకటి : ఐచ్ఛికముగ; రెండవది : ఆధికారికముగ. ఐచ్ఛికము ముఖ్యముగా ఏకభాషనుబట్టి ఏర్పడును. భాషయనగా రూపములేని మనోభావములయొక్క సాంకేతిక రూపముమాత్రమే. ఒకరి అభిప్రాయములను ఇంకొకరు తెలిసికొన గలిగినప్పుడే, వారిద్దరికిని సంబంధమేర్పడును. అట్టివారలొక సంఘముగా నేర్పడుదురు. ఇది ఐచ్ఛిక సంఘము. ఏక పరిపాలనకు లోబడిన సంఘము ఆధికారిక సంఘమనబడును. 'పరిపాలన' యనుపదము, జడమైన భౌగోళిక భాగమును, చైతన్యమైన మానవ సంఘభాగమును ఏకముగా బంధించుపదము; భౌగోళికమైన భారతదేశమున కంతకును క్రొత్తగా ఏకమైవ ప్రజాపాలన ఏర్పడినది. దేశమంతటిలోను, అన్ని ప్రాంతములలోని, ప్రజలవలన ఎన్నుకొనబడిన ప్రతినిధుల కూడికయే పార్లమెంటు. దాని శాసనములు దేశములోని ప్రజలనందరికిని ఏకముగా బంధించుటయే. భారతీయ సంఘమేర్పడినది. ఈ నూతన సత్యమును బాగుగా గ్రహించినచో, మనసాంఘిక దృక్పథము భారతదేశమున కంతకును వ్యాపించును.

చం : మనసంఘములోని కర్షక కార్మికులు ఈవిషయమును గుర్తించుటలేదా?

సూ : లేదు. వారు తాము సంఘములోని ప్రజలందరికిని కావలసిన, వసు సముదాయము నుత్పత్తిచేయుటకై నిర్మింపబడినారన్న విషయమును గుర్తింపక, అనగా తాము బాధ్యతను గుర్తింపక, బాధ్యతవలన మాత్రమే ఏర్పడు హక్కులకు ముందుగా ప్రాధాన్య

మిచ్చుచున్నారు. హక్కు అనుపదము భారతీయ భాషకాదు. మాక్సుముల్లరు పండితుడు చెప్పినట్లు హిందూ సంఘములో ధర్మము అను మాటతోగలదు. హక్కు అను పదము లేదు. మనము దానిని కృతజ్ఞతయని యనవచ్చును. వారు తమ ధర్మమునకన్న, హక్కునకు ఎక్కువ ప్రాధాన్య మిచ్చుటవలన వారి సమస్య ఇప్పుడు అతికఠినముగా ఏర్పడినది.

చం: వారిలో ఇట్టి చెడ్డమానసిక ప్రవృత్తి ఎట్లు ఏర్పడినది?

సూ: అందరితో బాటు వారికికూడ ఏర్పడినది. అసలు మానవుడనగా నేమో క్రిందటిసారియే చెప్పియుంటిని. భగవద్గీతలో చెప్పబడినట్లు, ఏకైక పరమాత్మయొక్క అంశలే, అనాదిగ, ప్రకృతిచే నాకర్షింపబడి, జీవాత్మలై, తమ ఆత్మశక్తి అంతస్థులను బట్టి, ప్రకృతిలోని, సత్వము, రజస్సు, తమస్సు, అను మూడు గుణములలో చిక్కుకొని, మూడు విధములైన ప్రవృత్తులను కలిగి, మూడు రకముల మానవులుగ ఏర్పడినవి. అనగా మానవులలో, సత్వగుణ ప్రధానులు, రజోగుణ ప్రధానులు, తమోగుణ ప్రధానులు అనువారలేర్పడిరి. ఫలానిగుణ ప్రధానులనగా, మిగిలిన రెండు గుణములు తాత్కాలికముగా లోపల అణగియున్నవనుట. ఈ గుణ భేధము, సత్వమైన జ్ఞానముయొక్క అంతస్థు భేధమును తెలుపును. దట్టమైన తమోగుణముతో కూడియున్నప్పుడు, దట్టమైన అజ్ఞానము ఏర్పడును. మన పూర్వులు, మన హైందవ సంఘమును స్థాపించునపుడు, అప్పటి ప్రజల అప్పటి ప్రధాన గుణములనుబట్టి, సంఘ జీవితమునకు అత్యావసరమైన నాలుగు ముఖ్యవృత్తులను నాలుగు రకముల ప్రజలకు పంచిపెట్టిరి. ఆ ముఖ్యవృత్తులు, ఆవశ్యకతతో, సమానములైనందువలన, వాటి ననుసరించువారుకూడ స్వాభావికముగా సమాన గౌరవార్హులుగానే ఎన్నబడుచుండిరి. ప్రస్తుతమున కర్షకులు, కార్మికులు అనబడువారు ఆ కాలములో నాల్గవ వృత్తికి జెందినవారు. అనగా సంఘమునకు అవసరమైన ఐహిక వస్తువులను ఉత్పత్తి చేయువారు. మొదటి మూడు వృత్తులు, (1) జ్ఞాన

వ్యాపకము, (2) ధర్మ పరిపాలన, (3) వస్తుసేకరణ. మహాత్ముని యవతారానంతరము, మన దేశములో మానవ, పరిణామ నూతన అంతస్థులో, ప్రజాస్వామ్య మేర్పడినందున, అనగా ప్రజలందరు ప్రభుత్వాధికారమునకు అర్హులైనటులనే, అన్ని వృత్తులకు అందరును అర్హులే. అర్హులగుట, అర్హతను కలిగియుండుట, ఒకటికాదు. ఏవృత్తులకు ఎవరెవరు అర్హతను సంపాదించుకొని యున్నారో, వారా వృత్తులను చేపట్టినచో సంఘమునకు మేలుకలుగును. సరియైన అర్హతను గలిగినవారు ఇతరులలోని అర్హతను గ్రహించ గలరు. అప్పుడు స్వాతిశయ చిహ్నమగు పోటీకి చోటుండదు.

చం: మీరిప్పుడు చాల సంగతులను దెల్పిరి. కర్షక, కార్మిక వృత్తులను ఎవరవలంభించినను, వారి సౌభాగ్య జీవితమునకు అవసరమైన పరిస్థితులను కల్పించి, వారికి తృప్తి కలిగించవద్దా ?

సూ: ఒక్క కర్షక, కార్మికుల విషయముననేగాదు. అందరి విషయముననూ చేయవలసినదే. నీవిప్పుడు ఉపయోగించిన, సౌఖ్యము, తృప్తి, పరిస్థితులు, అనువాటిలో మొదటి రెండు, చాల వరకు ఆయావ్యక్తుల మానసిక పరివర్తనమునుబట్టి ఏర్పడును. అనగా అవి అంతగా ఇతరులపై ఆధారపడవు. ఇతరులు కల్పించవలసినవి ముఖ్యముగా పరిస్థితులే.

చం: వాటిని దయచేసి, సెలవిండు.

సూ: ముందుగా, కర్షకులు, కార్మికులు, అను పదములనుగూర్చి విచారింతము. అవి, 'కర్' లేక 'కృ' అను ధాతువునుండి పుట్టినవి. అనగా కరచరణములను కర్మేంద్రియములతో పనిచేయువారు అని అర్థము. ఏ మానవుడైనను ఏపనిచేసినను, అది తన కొరకైగాని, ఇతరుల కొరకైగాని చేయును. ఇతరుల కొరకు పనిచేయువారు రెండు రకములుగా నుందురు. (1) ఇతరుల నుండి కేవలము లాభమును మాత్రము అపేక్షించి, పనిచేయువారు. అనగా ఆ లాభము రానిచో, పని చెయ్యనే చెయ్యరు. (2) ఇతరు

లలో తామకూడ భాగమనుకొని, మొత్తము సంఘమునకు పని చేయువారు. సాధారణముగా కార్మికులు మొదటి తరగతికి చెందిన వారు. ప్రజాస్వామ్య సంఘములో వారి దృక్పథము మారవలెను.

చం : ఆ కర్షకులకును, కార్మికులకును, తగిన జీవన సదుపాయములను సమకూర్చవలసిన, బాధ్యత ఆ ఇతరుల మీాద లేదా?

సూ : తప్పక ఉన్నది. ఆ సదుపాయములను ఇతరులనుండి తెప్పించుకొనుటకు చేయు ప్రయత్నములు సరిగా నుండవలయును.

చం : ఆ సరియైన మార్గములేమి ?

సూ : కర్షకుల విషయములో, వారు సంఘమునకు అతి ముఖ్యావసరమైన తిండిని సృష్టించుచున్నారు. వారికి సహజముగా నిస్వార్థత ఏర్పడుచున్నది. వారికి ఇతరులు సమకూర్చు సదుపాయములు సహజ కృతజ్ఞతా పూర్వకమైనవే. పూర్వము భూస్వాములు తమ కర్షకులను తమ కుటుంబములోని వారినిగానే చూచుకొనుచుండెడివారు. పరప్రభుత్వ బానిసత్వ ప్రవృత్తిలో ప్రతివారును స్వార్థతను పెంచుకొనిరి. స్వాతంత్ర్య భారతములో దానిని తగ్గించుకొనుటకు ప్రయత్నించవలసి యున్నది. కర్షకులను రాజకీయ స్వార్థపరులు రెచ్చకొట్టకుండినచో, భూస్వాములకును వారికినిమధ్య పోరాటము పెచ్చుపెరుగకుండెడిది. వారికేమైన స్వంతముగా భూమియున్నయెడల, వారును భూస్వాములే. కేవలము కౌలుదారులైన కర్షకులను గూర్చినదే కర్షక సమస్య. కావున కౌలుషరతులు సాధ్యమైనంతవరకు వారలకు అనుకూలముగా చేయబడవలసియున్నది. అందులకై భూస్వాములలో హృదయ పరివర్తనమును కలిగించవలెను. కవులు షరతులను ముందుగా ఒప్పుకొని, వాటికి విరుద్ధముగా తరువాత ప్రవర్తించు కర్షకులు నిందితులు. ఎక్కువ సదుపాయములను అడుగవచ్చునుగాని, ఎవరును మాటదబ్బరకులోను కాకూడదు.

చం : ఇంక కార్మికుల విషయములో మీా అభిప్రాయమేమి?

సూ : కార్మికులనగా పనిచేయువారు అని అర్థము. కర్మేంద్రియములచే చేయబడు ప్రతిపనియు జ్ఞానేంద్రియములచే ప్రోత్సహించబడుచున్నది. అటుల ప్రోత్సహించు జ్ఞానేంద్రియములు, ఇతరులవి కావచ్చును; తమవి కావచ్చును. సాధారణముగా, కార్మికుల కర్మేంద్రియములను ప్రోత్సహించి పనినిచేయించు జ్ఞానేంద్రియములు పెట్టుబడిదారులవిగా నుండవచ్చును. ఈ తరగతి కార్మికులకు కొంత వరకు రక్షణ అవసరము. ఏలనన, పెట్టుబడిదారు సహజముగా స్వార్థపరుడై యుండును. అతడు పరిశ్రమలను వృద్ధిపరచి, సంఘమునకు కావలసిన వస్తువుల ఉత్పత్తికి సహాయ పడువాడైనను, స్వలాభ ప్రవృత్తికి ప్రాధాన్యమిచ్చును. ప్రత్యేక వ్యక్తియొక్కగాని, కొందరు వ్యక్తుల కూటమియొక్కగాని, లాభముకొరకు ఏర్పడిన సంస్థలను 'ప్రేడు' అని పిలువవచ్చును. అనగా అందరి కార్మికులు ట్రేడు యూనియనులుగా ఏర్పడవచ్చును. ఆ సంస్థల యజమానులతో, అక్కడి కార్మికులకుగల తగాదాలు ట్రిబునల్సు అను మధ్యవర్తులద్వారా పరిష్కరింపబడవచ్చును. పెట్టుబడిదారుల సంస్థలలో పనిచేయువారుగాక, ప్రభుత్వపు కార్యాలయములలో పనిచేయువారు కూడ ఒకవిధమైన కార్మికులే. వీరు తమ జ్ఞానేంద్రియములను ఎక్కువగా ఉపయోగింతురు. వీరు పరప్రభుత్వ కాలములో, పెట్టుబడిదారుల కార్మికులవంటివారే. ఆకాలములో చిన్నతరగతి ప్రభుత్వోద్యోగస్తులు తమ జీతములను పెంపుచేయవలెనని పరప్రభుత్వము వారిని కోరినపుడు, ఆ ప్రభుత్వమువారు ఆ హెచ్చుధనమును ఎక్కడ నుండి తేవలయునని ప్రశ్నించుచుండిరి. ఆ బాధ్యత ఆ పరప్రభుత్వము వారిదేయని ఆ ఉద్యోగస్తులు జవాబిచ్చుచుండిరి. కాని, ప్రస్తుతపు స్వతంత్ర భారత ప్రజాప్రభుత్వములో అట్టిజవాబు పనికిరాదు. మహాత్ముని నూతన స్వతంత్ర భారతములోని సరిక్రొత్తగా ఏర్పడిన రెండు నూతన దృక్పథములను గమనించవలసియున్నది. అందొకటి, ప్రజాప్రభుత్వములో ఉద్యోగస్తులు ఆ ప్రభుత్వములోని భాగములే. వారు తాము ప్రభుత్వముకన్న వేరనుకొనరాదు. రెండవది, ప్రజా

ప్రభుత్వ సంస్థ 'ట్రేడు' అనబడజాలదు. అందువలన ప్రభుత్వోద్యోగస్తులెవరును ట్రేడు యూనియనులుగా ఏర్పడరాదు.

చం : అయితే వారి సౌఖ్య జీవితమునకు అవసరమైన సదుపాయము లుండవలదా ?

సూ : తప్పక ఉండవలెను. కాని ఆ సదుపాయములకు అవసరమైన హెచ్చుధనమును ఎచ్చటనుండి తేవలయునో తెలుపవలసిన బాధ్యత, నూతనముగా ఏర్పడిన ప్రజాప్రభుత్వ స్థితిలో, ఆ ఉద్యోగస్తుల మీదనే పడ్డది. ఈ నూతన దృక్పథమును ఆ ఉద్యోగస్తు లింకను గ్రహించకపోవుట చాల విచారకరము. రాజకీయ స్వార్థపరులు కొందరు వీరిని పాత దృక్పథములో నుంచదలచి చేయుప్రయత్నములు ఇందుకు కొంతవరకు కారణము కావచ్చును.

చం : ఈ ఉద్యోగస్తులలో గవర్నమెంటు స్కూళ్ల వుపాధ్యాయులుకూడ చేరరా ?

సూ : తప్పక చేరుదురు. వుపాధ్యాయ వృత్తి అనగా అధ్యాపకవృత్తి అతిపురాతనమైన విద్యుక్త ధర్మము. అందువలననే, డబ్బు పుచ్చుకొని, అనగా ముందుగా బేరమాడి చదువు చెప్పువారు అపాంక్తేయులని మనస్మృతులు ఘోషించుచున్నవి. మరియు కాళిదాసు మహాకవి తన 'మాళవికాగ్ని మిత్రమను' నాటకములో దెలిపినట్లు "కొందఱు విద్య నన్యులకు కోవిద్యులయ్యును నేర్పలేరిలన్" అసలు ఇంగ్లీషులోని (Education) ఎడ్యుకేషన్ అన్న పదమున కర్థము "బయటకు లాగుట"యే. అనగా గురువు శిష్యునిలో ఉండియున్న జ్ఞానమును బయటికి లాగుట మాత్రమే; కాని తాను క్రొత్తగా శిష్యునిలో చొప్పించునట్టిది కాదు. బృహదారణ్యకోపనిషత్తులోని మైత్రేయీ యాజ్ఞవల్క్యన్ సంవాదమునందు తెలుపబడినట్లు All knowledge is remembering ఒక ప్రత్యేక విషయక జ్ఞాన సంపాదన యనగా, సర్వజ్ఞ పరమాత్మ అంశమైన జీవాత్మలో, ప్రకృతి ఆకర్షణ నివురుక్రింద

నిమిడియుండిన అట్టిజ్ఞానమును పైకి జ్ఞాపకమునకు దెచ్చుకొనుటయే. అట్టిజ్ఞాపకము స్వయంకృషి (Self-Thniking) వలనగాని లేక ఇతరులు బోధించినప్పుడులోనుండి ప్రతిధ్వనించుట వలనగాని ఏర్పడ వచ్చును. ఇంక 'గురు' శబ్దమున కర్థము చీకటిని పోగొట్టువాడు అనుటయేగాని వెలుతురు నిచ్చువాడు అని అర్థముకాదు. ఎవరైన నిప్పుమీది నివురును విసనకర్రతో పారద్రోలినంతమాత్రమున అతడు ఆ అగ్నిజ్వాలను స్వయముగ సృష్టించి నాడనవచ్చునా? ఈ రోజులలో గట్టిగ విసరి శిష్యులలోనున్న జ్ఞానాగ్నిని ప్రజ్వరిల్ల చేయలేనివారు "బ్రతకలేక బడిపంతులు"గ యేర్పడినవారే, అట్టివారే యిప్పుడు ఎక్కువగ వుపాధ్యాయ వృత్తి నవలంభించుట చేతనే విద్యార్థులలో జ్ఞానము సరిగ ప్రకాశించుటలేదు.

చం: ప్రస్తుతమున గవర్నమెంటు కచ్చేరిలలో పనిచేయువారు మాత్రమేకాక గవర్నమెంటు స్కూళ్లలోని వుపాధ్యాయులు కూడ గవర్నమెంటు వుద్యోగస్థులగుటచే వారలకు హెచ్చు జీతము అవసరమైనప్పుడు యేమిచేయవలయును?

సూ: ఈ వరకే మొట్టమొదట్లో నేచెప్పినట్లు ప్రజా ప్రభుత్వకాలములో చక్కని రాజమార్గ మొక్కటియే కలదు. అది ప్రజా ప్రతినిధుల ద్వారా, వారిచేతనే, అనగా వారిలో పెక్కుమందిచే, నిర్మింపబడిన మంత్రిమండలికి తెలియజేయుట ప్రజల వోట్లచే, ఎన్నుకొనబడిన ప్రతినిధులు. ప్రజలలో భాగమైన ఆ ఉద్యోగస్తులకు కూడ ప్రతినిధులే. ఆ ప్రతినిధులు, తమకివ్వబడిన 'బడ్జెటు' పుస్తకములోని జమాఖర్చు లెక్కలను శ్రద్ధతో పరిశీలించి, ఆ ఉద్యోగస్తులు కోరు హెచ్చుధనమును సేకరించు మార్గమును కనిపెట్టి, హెచ్చుమంది సభ్యుల ఆమోదమును ముందుగా పొంది, మంత్రిమండలికి దెలిపి, వారిచే కావలసిన పనిని చేయించగలరు. ఈ నూతన శక్తిని ఆ ప్రతినిధులు సరిగా గ్రహించవలెను. ఇది ఒక్కటియే చక్కని రాజమార్గము.

చం: బాగున్నది. ఇట్టి హెచ్చు ఖర్చుకుగాను ప్రభుత్వమే నూతన మార్గమును కనిపెట్టవలదా?

సూ: ప్రభుత్వమనగా నీ ఉద్దేశములో మంత్రులనబడు వారు మాత్రమే అన్నట్టున్నది. ప్రజాప్రభుత్వమనగా, ప్రజాప్రతినిధుల ప్రభుత్వము. అంతియే గాని, ప్రస్తుతమున, ప్రజలందరియొక్క ప్రభుత్వము కాదు. ఏలననగా, ఈ వరకే చెప్పినట్లు ప్రస్తుతమున ప్రజలలో పెక్కుమంది కేవలము స్వార్థపరులైన అజ్ఞానులు అని అందరును ఒప్పుకొన్న విషయమే. ఆ అర్థములో ప్రజాప్రభుత్వమనగా అజ్ఞానుల ప్రభుత్వమనవలసి వచ్చును. అందువలననే మహాత్ముడు 1930 లోనే, పాశ్చాత్య ప్రజాస్వామికము, అందరి ప్రజలను సమానముగా నెంచి, వారందరిలోని మెజారిటీ ఇష్టప్రకారము ప్రభుత్వము నడుపబడవలయునను సిద్ధాంతమును పెంచి, చెడిపోవుచున్నదనియు, మన భారతదేశములో యథార్థ ప్రజాస్వామికము నెలకొల్పబడవలసి యున్నందున పరస్పర సంఘర్షణలకు దారితీయు, వివిధ ప్రజల వివిధ ప్రేయములకు గాక, ఏకముగా నుండదగు శ్రేయములకు ప్రాధాన్యమిచ్చు, త్యాగశీలురు, సేవాతత్పరులు, అయిన ఏ కొద్దిమందియో నిజమైన ప్రజాప్రతినిధులై వారు తమలోనుంచియే కార్యవర్గమును ఎన్నుకొని, దానిచే ప్రభుత్వయంత్రమును నడిపించవలయునని ఆదేశించియుండెను.

చం: చాలా క్రొత్తసంగతులను తెలిపినారు. నమస్కారము. అవసరమున్నచో, తిరిగి మరియొకసారి దర్శనము చేసెదను. సెలవు.

సూ: ఇంకా కొన్ని చిన్న చిన్న సమస్యలు గలవు. వాటినిగూర్చి తరువాత చర్చించుకొందము. పోయిరమ్ము. ఓం శాంతిః, శాంతిః, శాంతిః.



మూడవ ప్రకరణము.

( చంద్ర, సూర్య సంభాషణలు )

## —: ఇతర సమస్యలు, దుర్భ్రమలు :—

చంద్రుడు : నమస్కారము, సూర్యభగవాన్లుగారూ, నేను మీకెంతయు కృతజ్ఞుడను. మీవలన చాలా సంగతులను తెలిసికొంటిని. క్రిందటిసారి, ఇంకా కొన్ని చిన్న చిన్న సమస్యలున్నవని సెలవిచ్చియుంటిరి. దయచేసి వాటినిగూర్చి కూడ తెలుపగలరా ?

సూ: ఆ చిన్న సమస్యలు చాలవరకు దుర్భ్రమలకు సంబంధించినవి. అసలు సమస్యలు అంటూ ఎందుకు ఏర్పడినవో నీకు తెలుసునా ?

చం: ఏ విషయమును గురించి యైనను ప్రజలలో గాఢమైన భేదాభిప్రాయములు ఏర్పడినప్పుడే, ఆ విషయమొక సమస్యగా ఏర్పడుననుకొంటాను.

సూ: అవును. అసలు అభిప్రాయభేదమంటూ ఎందుకు ఏర్పడుతుంది ?

చం: పుర్రె, పుర్రె బుద్ధి, జిహ్వా, జిహ్వారుచి, అన్నట్లు వివిధ ప్రజలకు వివిధ అభిప్రాయములుండుట సహజము కదా.

సూ: అటువంటప్పుడు, ఏకాభిప్రాయమును సంపాదించ బ్రయత్నించుట సఫలము కాగలదా ?

చం: హేతువాదమువలన సఫలము కావచ్చుననుకొంటాను.

సూ: అనగా, మొదట ఒక విధముగాను, హేతువాదము వలన మరియొక విధముగాను అభిప్రాయ మేర్పడుట, ఎటుల సంభవించును ?

చం: ఆ మార్పు విధానము నాకు బాగుగా తెలియదు.

సూ: నేను చెప్పెదను వినుము. అభిప్రాయ మనునది, మానవదృష్టికి గోచరించిన సత్యము. మానవదృష్టి రెండువిధములు. ఒకటి, భౌతికదృష్టి, రెండవది, మానసికదృష్టి, భౌతికదృష్టినిగూర్చి, 'ఏది సత్యము' అను చిన్న కథ యొకటి ఆంగ్లములో కలదు.

చం: ఏమిటా కథ ?

సూ: ఒక ఫ్రాల్లో, ఒక రోడ్డుమీద, ఒక ఆర్చి కట్టబడినది. ఆ ఆర్చియొక్క ఒకవైపు బంగారుమలాముతోను, రెండవవైపు వెండి మలాముతోను, అలంకరింపబడెను. ఒక రోజున ఇద్దరు సిపాయిలు ఇరుపక్కలనుండి, గుర్రము స్వారిచేయుచు, ఆ ఆర్చివద్దకు వచ్చుచుండిరి. బంగారు మలాము అలంకరణమును చూచిన యాతడు దానిని గూర్చి బిగ్గరగా శ్లాఘించుచుండెను. అదేవిధముగా వెండి మలాము అలంకరణమును చూచిన యాతడు తాను చూచినదానిని గూర్చి బిగ్గరగా శ్లాఘించుచుండెను. ఒకరినొకరు ఎదురుగా సమీపించి నపుడు, ఒకరినొకరు అసత్యవాదులని నిందించుకొనుచు, గుర్రములను దిగి, ఒకరితో నొకరు, తమ చేతిలోనున్న ఖడ్గములతో కయ్యమునకు ఢీకొనిరి. ఆ దారిని బోవు వేరొకడా కయ్యమును గని, కారణమును తెలిసికొని, వారిద్దరికిని రెండువైపులను చూపించి, రెండు అభిప్రాయములు సత్యములే అని నిరూపించి, కయ్యము నణచివైచెను. అనగా, ఎదుటివాని దృక్పథమును కూడ సరిగా గ్రహించగలిగినచో, పోరాటము తగ్గును.

చం : మంచి ఉపమానమును బోధపరచినారు. ఇంక మానసిక దృష్టి సంగతి ఏమి ?

సూ : మానసిక దృష్టిభేదములను సమన్వయపరచుట సులభసాధ్యముకాదు. భౌతికదృష్టిలో, రెండు దృక్పథములే యుండి, ఆ దృష్టి పక్కకు ప్రసరించును. ఇక్కడ ప్రశ్న, 'ఏది సత్యము.' మానసిక దృష్టి పలువిధములుగ నుండి, పైకి ప్రసరించును. అనగా

అంతస్థులను కలిగియుండును. ఇక్కడ ప్రశ్న, ఏది సత్యమునకు సమీపము. కావున మానసిక దృక్పథ భేదములకు గారణము, అంతస్థుల భేదమే.

చం: అంతస్థుల భేద మెట్లేర్పడినది ?

సూ: చూచు అద్దములను బట్టి ఏర్పడును. అనగా సూక్ష్మ ప్రకృతి సంబంధమైన, సత్వము, రజస్సు, తమస్సు. అనుగుణములకు సంబంధించిన పాళ్ళను బట్టి వివిధ అర్ధములేర్పడును. అనగా, ఆ అర్థములు అంతస్థులుగా నుండి పరమసత్యము వైపుకు వ్యాపించును. ఆ అంతస్థుల భేదమును బట్టి అభిప్రాయ భేదములేర్పడును. అనగా దృక్పథ భేదము లేర్పడును. ఏక అంతస్థు ఏర్పడినప్పుడే, ఏకాభిప్రాయ మేర్పడును. ఒకడు వేరొకని అభిప్రాయమును మార్చదలచిన యెడల, వాని దృక్పథ అంతస్థును ముందుగా మార్చవలెను. ఈ సత్యమును గ్రహించినచో, అనవసర వాద ప్రతివాదములు తగ్గిపోవును. మానవుడు తన నిశితమైన బుద్ధి నుప యోగించి తన అంతస్థును మార్చుకోగలడు. అటుల మార్చుకో లేనివాడు, నమ్మకముపై ఆధారపడవలసియుండును. అనగా, తన మానసిక అంతస్థుకన్న, ఎదుటివాని మానసికఅంతస్థు ఉన్నతమైనదని తాను నమ్మినప్పుడు, ఆ ఎదుటి వాని అభిప్రాయముతో ఏకీభవించ వలసియుండును. ఈ విధముగనే, మానవుడు మానసికాభివృద్ధిని పొందగలడు.

చం: మహాత్ముని ఉన్నత మానసిక అంతస్థుకు సంబంధించిన, అయన నూతన దృక్పథమును మనము గ్రహించుటకు బ్రయత్నించి, పాత దృక్పథములను వదలుకొనవలయుననియా మీ అభిప్రాయము ?

సూ: అవును, చక్కగా కనిపెట్టినారు.

చం: మీరీవరకు ఉదాహరించిన ఆరు సమస్యలను గూర్చి, ప్రజలలో గల పాత దృక్పథములేమి ? ఆ సమస్యలను గురించిన

మహాత్ముని నూతన దృక్పథము లేమి? సవిస్తరముగా మరియొక సారి విశదీకరించెదరా?

సూ: చెప్పెదను వినుము.

(1) ప్రజాస్వామ్య సమస్య.

పాతదృక్పథము :-

పాశ్చాత్య దేశములలో, మానవుడనగా శరీరము మాత్రమే యని యనుకొని, శారీరక శాస్త్రము ననుసరించి, మానవులలో భేదములు విశేషముగ గానరానందున, అందరును సమాన మానసిక అంతస్థులోనివారే యని ఊహించి, వారి ప్రేయములకు ప్రాధాన్య మిచ్చి, ఆ ప్రేయములను బట్టి ఏర్పడిన కేవలము మెజారిటీ ఓట్లపై ఆధారపడిన అచ్చటి పాతపద్ధతినే మనదేశమున నవలంబించ దలచుట.

మహాత్ముని నూతనదృక్పథము :-

భారతదేశములో యథార్థ ప్రజాస్వామ్య శాస్త్రము వెలుగొందవలయునన్నచో, ప్రభుత్వములో సహజముగా అధికారమును బొందు ఏ కొద్దిమందియో, ప్రజల ప్రేయములకన్న శ్రేయములకు ఎక్కువ ప్రాధాన్యమీయవలయును.

(2) భాషారాష్ట్ర సమస్య.

పాతదృక్పథము :-

భారతదేశములో పూర్వము చాలాకాలముగ అనేక భిన్న రాజ్యములేర్పడి, భిన్నప్రాంతీయాభిమాన మనస్తత్వములకు ప్రజలు అలవాటు పడియుండిరి. బ్రిటిషువారి పాలనలో ఏకరాజ్యమేర్పడి నను, అది పరదేశీయుల, పెట్టుబడిదారుల, పరిపాలన యగుటచే, ఆ ఏకత్వము స్వాభావికముగా నుండజాలకుండెను. ఆ ఏక ప్రభుత్వము పోయిన వెనుక, తిరిగి పాత ప్రాంతీయాభిమానములు తల లెత్తెను.

మహాత్ముని నూతనదృక్పథము :—

మహాత్ముడు మొట్టమొదటిసారిగ, దేశమంతటిని రాజకీయముగ, ఏకముగా భావించి, అట్టిదాని స్వాతంత్ర్యమునే సాధించ దలచి, దేశములోని అన్ని ప్రాంతములవారి చేతను సమానముగా కృషి చేయించుటలో, ఆయన ఉద్దేశ్యము, దేశములోని ప్రతి అంగుళము ప్రతి భారతీయ పౌరునిది అని నిరూపించుటయే, కావున ఎవరైనను, ఈ వూరు నాది అని అనుటలో, ఆవూరు నాది కాదు, అనగా ఆవూరి సంగతి నాకక్కరలేదు, అను, అర్థము ఇమిడి యున్నందున, అట్టిభావమునకు తావీయరాదని మహాత్ముని ఆశయము

(3) మద్యపాన నిషేధ సమస్య.

పాతదృక్పథము :—

ఆత్మాభివృద్ధి దృష్టిలేని బ్రిటిషు పరిపాలనలో ధనమే ప్రధానమగుటచేత ప్రభుత్వము దానిని సేకరించుటకు మద్యపాన వ్యాప్తి మార్గమునను సరించుట తప్పుగా దలచబడలేదు.

మహాత్ముని నూతనదృక్పథము :—

ఆత్మాభివృద్ధికి ప్రాధాన్యమిచ్చు భారత ప్రభుత్వములో, దాని ప్రాముఖ్యత తగ్గవలసియున్నది. అనగా, సారాయములను ప్రయత్న పూర్వకముగా సేకరించి. వాటిని ప్రజలకు పంచిపెట్టు పనిని మానుకొనవలయును. మరియు ఇతర విధముల, వాటి వ్యాప్తిని నిరుత్సాహపరుప వలయును.

(4) భూసంస్కరణ సమస్య.

పాతదృక్పథము :—

హిందూరాజుల కాలములో భూస్వాముల మనస్తత్వమెట్లుండినను, పర ప్రభుత్వకాలములో, బానిసత్వ కారణమున, దట్టమైన స్వార్థతతో నిండియుండెను. దానిని తొలగించుటకు పాతకాలపు హింసాపద్ధతి చాలమందిని ఆకర్షించియున్నది.

**మహాత్ముని నూతనదృక్పథము :—**

మానవుడనగా కేవలము దేహమాత్రుడు గాడనియు, ఆతనిని ఏకార్యమునకైనను పురిగొల్పునది, ఆతని మనస్సనియు, కావున మనస్సును మార్చుటకు అహింసా మార్గమునే అవలంబించవలయుననియు, మహాత్ముడు క్రొత్తగా కనిపెట్టెను. ఈ నూతన పరిశోధన రహస్యమార్గమునుపయోగించియే, మహాబలయుతమైన బ్రిటిషు ప్రభుత్వములో హృదయ పరివర్తనమును కలగించి, మనకు స్వారాజ్యమును సంపాదించిపెట్ట గలిగెను.

(౫, ౬) కర్షక, కార్మిక సమస్యలు,

**పాతదృక్పథము :—**

బ్రిటిషు పరిపాలనలో మనకు సంఘమనునది లేదు. ఎవరికి వారు పర ప్రభుత్వమునకు యాచకులై ప్రత్యేక వ్యక్తిత్వములను పెంచుకొంటిరి.

**మహాత్ముని నూతనదృక్పథము :—**

స్వాతంత్ర్య భారతములో, మనకిప్పుడు ఏకైక ఆధికారిక సంఘమేర్పడినది. సంఘక్షేమములో వ్యక్తిక్షేమమిమిడియున్నదన్న సత్య సిద్ధాంతమును మహాత్ముడు మనకు బోధించెను.

చం : పాతదృక్పథములకును, మహాత్ముని నూతన దృక్పథలకును గల తేడాలను బాగుగా తెలిపినారు.

సూ : మహాత్ముడు తన నూతన దృక్పథ పునాదుల మీదనే మన స్వతంత్రభారతమును నిర్మించినాడు. ఆ పునాదులను తప్పించినచో, అనగా పాతదృక్పథములకు ప్రాముఖ్యత నియ్యనారంభించినచో, ఆయన నిర్మించిన నూతన స్వతంత్ర భారతసౌధము కూలిపోగును.

చం : అటువంటప్పుడు, కొన్ని రాజకీయ సంస్థలిప్పుడు, ఆపాత దృక్పథములకు ప్రాముఖ్యత నెందుకిచ్చుచున్నారు ?

సూ : మహాత్ముని కాలములోనే ఆ ఇతర సంస్థలు, ఆయనతో ఏకీభవింపక వేరుగా ఏర్పడినవి. అనగా, ఆయన నూతన పునాదులను వారు ఒప్పుకొనలేదు. కావున, వారు తమ పాతదృక్పథ వ్యాప్తికై ప్రయత్నించుట వింతగాదు.

చం : అటువంటప్పుడు మనము చేయవలసిన పనియేమి ?

సూ : మహాత్ముని కాలములో ఇతర సంస్థలకు జెందినవారు కొద్దిమంది మాత్రమే యుండెడివారు. వారి పలుకుబడి తక్కువగా నుండెను. మన దేశములో క్రొత్తగా ప్రజాస్వామ్య మేర్పడిన తరువాత, ఆ వరకు ప్రజాస్వామ్యమును పొందియుండిన పాశ్చాత్య దేశములలోని ప్రజాస్వామ్య పద్ధతులను అనుకరించుటకు ఆ ఇతర సంస్థలవారు పూనుకొనిరి. మన నూతన ప్రజాస్వామ్య నిర్మాణమునకును, పాశ్చాత్య ప్రజాస్వామ్య నిర్మాణమునకును ఆదిలోనే చాలా వ్యత్యాసము కలదు. పాశ్చాత్య దేశములలో, స్వాతంత్ర్య పోరాటములలో జయమునొందిన తరువాతనే, ప్రజలు తమ నూతన ప్రభుత్వ స్వరూపమును నిర్ణయించుకొన మొదలుపెట్టిరి. అందువలన, ప్రజలు తమ అభిప్రాయ భేదములను బట్టి పార్టీలుగా ఏర్పడి, దాని స్వరూపమును ఇచ్చవచ్చినట్లు మార్చుకొనుచున్నారు. కాని, మన దేశములో, స్వతంత్ర భారత మేర్పడకముందే, మహాత్ముడు దాని స్వరూపమును కాంగ్రెసు పేర పోరాటమారంభించెను. కావున పాశ్చాత్య ప్రభుత్వములలో వలె మన దేశములో వివిధ పార్టీలకు చోటు లేదు. ఆయన కాలములో ఆయన నియమములకు బద్ధులై యుండి ప్రభుత్వమును సాగించుచుండిన, కాంగ్రెసు సంస్థకు జెందిన, వారు ప్రభుత్వమును పెడదారుల బట్టించుచుండినచో, ఆ సంస్థకు జెందిన పెద్దలే, అనగా మహాత్ముని ఆదర్శములను కలవారే, వారిని సదుద్దేశపూర్వకముగా సరియైన మార్గమునకు త్రిప్పవలయును. కాని,

ఇతర దేశములలోవలె వ్యతిరేక ఆదర్శములు గల వ్యతిరేక పార్టీలకు ఇక్కడ చోటు లేదు.

చం : అందువలననే కాబోలును, మహాత్ముడు. చాలదిన ములకు ముందుగనే, స్వాతంత్ర్య సంపాదనానంతరము, కాంగ్రెసు సంస్థ ఏక సర్వోదయ సంస్థగా మారి, పరిపాలనను ప్రజలకందరికి వదిలి, ఆ పరిపాలనపై అజమాయిషీని మాత్రము జరిపించవలసిన దని చెప్పియుండెను.

సూ : బాగుగా జ్ఞాపకమునకు దెచ్చితివి. మహాత్ముని ప్రత్యేక నూతన సర్వోదయ సంస్థ నిర్మాణ సూచన, తానాః రకు నిర్మించిన కాంగ్రెసుసంస్థ ఆదర్శములతోడనే ప్రజలు పరిపాలనను సాగించవలయుననికాదా? ప్రజలనగా కాంగ్రెసేతరులనియూ ఆయన యర్థము? కొందరి మనస్సులలో కలిగిన ఈ యర్థము, స్వతంత్రి ప్రభుత్వ స్వీకరణ దినమునకు నాలుగురోజులు ముందుగ, నెహ్రూ మహాశయుని దృష్టికి తేబడగా, ఆ యర్థమునుబట్టి కాంగ్రెసు వార ప్పుడు ప్రభుత్వ బాధ్యతను వదలుకొన్నచో, వ్యతిరేక ఆదర్శములు గల ఇతర సంస్థలు విజృంభించి, ప్రభుత్వమును మహాత్ముని ఆదర్శ ములనుండి వేరుచేయవచ్చునని వారికి నచ్చజెప్పెను. అందువలననే, మహాత్ముడు తన కాలములోనే ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వమును అంగీకరించెను.

చం : చిన్న సమస్యలగు దుర్భ్రమలను గురించి ఏమియు చెప్పినారుకారు.

సూ : దుర్భ్రిమలనగా అపోహలు. అవి అనేక విషయ ములకు సంబంధించినవి. నాకిప్పుడు తోచినవి ఆరు.

చం : వాటినిగూర్చి కొంచెము సెలవిచ్చెదరా?

సూ : కొంచెముగా సూచించెదను :—

(1) ఇతరులపై ఆరోపణలు :— ఇవి మనస్సాక్షికి మానవుడుపెట్టు ఆవేదనకు ఫలితములు. ఇవి, సత్యమైన విషయములను సరిగా తెలిసికొనుటకు ఓపిక లేక, స్వంత అనుభవములనుబట్టి ఇతరుల మనోభావములను ఊహించుటవల్ల ఏర్పడును. ఎవడైనను ఎదుటి వాని వాదబలిమివలన, అనగా, నూతన పరిస్థితుల అవగాహనవలన, మారినచో, అతనికి లంచ స్వీకార మారోపింతురు. ఇట్టిది మహాత్మునికే దక్షిణాఫ్రికాలో ఆరోపింపబడినది.

(2) వ్యక్తిమనస్సాక్షిప్రాముఖ్యత:— వ్యక్తి మనస్సాక్షి వ్యక్తికి మాత్రమే సంబంధించినది. దానిని అందరికిని సంబంధించిన సంఘ విషయమున ప్రాముఖ్యత నీయకూడదు. ప్రజాస్వామికములో, వ్యక్తి సత్యాగ్రహమునకు తావున్నను, సమిష్టి సత్యాగ్రహమునకు తావులేదని మహాత్ముడు స్పష్టముగా చెప్పియుండెను. వ్యక్తి సత్యాగ్రహము ఆధ్యాత్మిక సత్యముపై ఆధారపడియుండును.

(3) సిద్ధాంతముల నిరసన :— ఇతరులయొక్క ఆచరణకు ప్రాముఖ్యత నీయదలచినవారు దీనినుపయోగింతురు. ఆచరణ ఎప్పుడును దానికి సంబంధించిన సిద్ధాంతము మీదనే ఆధారపడి యుండును. సిద్ధాంతము మనస్సులో ముందుగా గట్టిగా నాటుకొన్నప్పుడే, ఆచరణ స్థిరముగా ఏర్పడును. ఒకానొక ఆంగ్లేయ శిక్షాని నుడివినట్లు, ప్రతి సిద్ధాంతాచరణమునకును మూడు అంతస్థులుండును. మొదటిది సిద్ధాంత గ్రాహ్యము; రెండవది, తాను గ్రహించిన సిద్ధాంతమును బయటికి తెలుపుట; మూడవది తదనుచరణము.

(4) రాజకీయముల, రాజ్యాధికారముల తారతమ్యత :— రాజులు వేరు, ప్రజలు వేరు అన్నరోజులలో, రాజకీయములతో ప్రజలకు పరిసక్తి లేదు. ప్రజాస్వామ్యములో ప్రతిపౌరునికిని రాజకీయ బాధ్యత ఒక ధర్మముగా ఏర్పడినది. అట్టిస్థితిలో మాకు రాజకీయము లక్కర లేదనుట అర్థశూన్యము. రాజకీయము వేరు, రాజ్యాధికారము వేరు. రాజ్యాధికారమును చెలాయించుటకై పెనగులాడుటతగదు.

(5) లక్ష్యముల, లక్ష్యసాధనముల సంబంధము :— లక్ష్యము సరియైనప్పుడు, లక్ష్యసాధన ఎట్టిదైనను, సమర్థనీయమే అను పాత సిద్ధాంతము ఆంగ్లేయ సామెతలోగలదు. మహాత్ముడు క్రొత్తగా బోధించినది: ముందుగా సాధనలు సరియైనవిగా నుండవలయుననియే. భగవద్గీతలో చెప్పినట్లు, ప్రయత్నము అనగా సాధన మాత్రమే మన చేతిలోనున్నది. అందువలన దాని శ్రేష్ఠతయే మనము చూచుకొనవలసినది. మన వస్తువులను ఇచ్ఛాపూర్వకముగా ఇతరులకొరకు వదలుకొనుట కాంగ్రెసు సోషలిజము. ఇతరుల బలవంతముపై, వదలుకొనవలసి వచ్చుట కమ్యూనిష్టుల సోషలిజము. ఫలితము లేక, లక్ష్యము, ఒకటిగానే కనుపడుచున్నందున, మార్గభేదములను విస్మరించి, రెండును సమానములే అనుకొనుట అజ్ఞానము.

(6) నిర్వ్యాచీ ప్రసంగములు :— మనము ఏమి మాట్లాడినను, ఆ మాటలవలన, ఎవరికైనను, ఏవిధమైన ఉపయోగమైనను, కలుగుచున్నదాయని తర్కించుకొనుచుండవలయును. కేవల కాలహరణమునకై, ఇతరులపై ఆధారములేని నిందలను మోపుచు, మనస్సంతుష్టిని బొందుచుండుట చాలమందికి అలవాటైనది. ఇట్టివి నిర్వ్యాచీ ప్రసంగములు. ఇవి స్వీయాభివృద్ధికి ఆటంకములు, కేవల సద్బుద్ధిపూర్వక హాస్య ప్రసంగములవలన చేటులేదు.

చం : సూర్యుడుగారూ, మీకు చాల ఋణపడియున్నాను. చాల సంగతులను తెలిపితిరి. సెలవు తీసికొనెదను. నమస్తే.

సూ : పోయిరమ్ము. సమస్తము భగవదాధీనము. ఆచార్య వినోబాభావేగారు చెప్పినట్లు, మనకుగల స్వాతంత్ర శక్తి, ఒక గుంజకు పొడుగాటి త్రాటితో కట్టబడిన ఆవుయొక్క పరిమిత స్వాతంత్ర్యము వంటిది. దానిని మనము సరిగా ఉపయోగించుకొనవలయును. ఎట్టి స్వాతంత్ర్యము లేనివానివలె, సోమరితనమును వహించరాదు.
'మాతే సంగోస్త్వకర్మణి'

ఓం శాంతిః, శాంతిః, శాంతిః.